## గ్రంధ పరిచయం

డాక్టర్ **బి.వి. రామన్** జ్యోతిష గ్రంథావళి

# గ్రహ - భావ బలములు

## GRAHA - BHAVA BALAMULU

ఆంగ్ల మూలము

డాక్టర్ బెంగుళూరు వెంకటరామన్

తెలుగు అనువాదం

పాలపర్తి శ్రీకాంత్

కాపీలు కావలసినయెడల :

**మోహన్ పబ్లికేషన్స్**

కోటగుమ్మం, అజంతాహోటల్ ఎదురుగా

రాజమండ్రి. 1. ఫోన్ : 2462565

వెల రు. 50-00

**గ్రహ భావ బలములు**

**Graha Bhava Balamulu**

ఆంగ్ల మూలం : డాక్టర్ బి. వి. రామన్

తెలుగు అనువాదం :

పాలపర్తి శ్రీకాంత్

ప్రథమ ముద్రణ :

2003

ముద్రణ :

స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్

ప్రచురణ కర్తలు

ఋషి ప్రచురణలు

**బి.వి.రామన్ గారి గ్రంథములు**

| | |
|---|---|
| జ్యోతిష విద్యారంభం | రూ. 50/- |
| గ్రహభావ బలములు | రూ. 50/- |
| కాలచక్రదశ | రూ. 50/- |
| అనుభవ ప్రశ్నాజ్యోతిషం | రూ. 50/- |
| జ్యోతిషశాస్త్రంలో -వాతావరణ భూకంపాలు | రూ. 50/- |
| భావార్థరత్నాకరం | రూ. 75/- |
| భారతీయజ్యోతిష సర్వస్వం | రూ. 75/- |
| అష్టకవర్గ పద్ధతిః | రూ. 75/- |
| పురోగామి జాతకం | రూ. 75/- |
| జ్యోతిష శాస్త్రంలో -సందేహాలు, సమాధానాలు | రూ. 75/- |
| ప్రశ్నతంత్ర | రూ. 75/- |
| ముహూర్తం | రూ. 75/- |
| విశిష్ట జాతకములు | రూ. 125/- |
| భారతీయఫలితజ్యోతిషం | రూ. 125/- |
| 300 ముఖ్యమైన యోగములు | రూ. 125/- |
| జాతకంపరిశీలించడంఎలా ? | రూ. 250/- |

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

**మోహన్ పబ్లికేషన్స్**

కోటగుమ్మం, అజంతాహోటల్ ఎదురుగా

రాజమండ్రి. 1. ఫోన్ : 2462565

## అనువాదకుని మనవి

శ్రీ బి.వి. రామన్ గారి గ్రంథాన్ని అనువదించగల అవకాశం రావటం నాలాంటి జ్యోతిష శాస్త్ర విద్యార్థికి గొప్ప వరం. అటువంటి వరం "ఋషి ప్రచురణలు" అధినేత శ్రీ ఆకుల పవన్‌కుమార్ గారి ద్వారా లభించింది. వారికి సర్వదా కృతజ్ఞుడను.

ప్రస్తుత గ్రంథము గ్రహముల, భావముల బల సాధనము ఎలా చేయాలో వివరిస్తుంది. శ్రీ బి.వి. రామన్ వివరించినట్లుగా, బలసాధనను చేయవలసిందే, కాని బలసాధన ఒక్కటే ఫలితాల సమన్వయానికి, విశ్లేషణకు ఉపయోగించదు. మన సహజావబోధనము కూడా (Intuition) గ్రహించాలి. లేకుంటే ఫలితం లభించదు.

నా మాతాపితరుల, గురువుల, దైవం యొక్క ఆశీర్వాదం చేత ఈ అనువాదాన్ని పూర్తి చేయగలిగాను. ఈ గ్రంథములోని గుణములు గ్రంథ కర్తవి. దోషములు అనువాదకునివి.

మీ నిర్మాణాత్మక విమర్శలను సదా కోరుకుంటూ.

**పాలపర్తి శ్రీకాంత్**

డో.నెం. 27-18-37,
ఫ్లోర్ - 2,
H/o. పి.జి.కె.మూర్తి,
కాంగ్రెస్ ఆఫీస్ రోడ్,
గవర్నర్‌పేట, విజయవాడ - 520 003



## విషయసూచిక

## మొదటి ముద్రణకు ముందుమాట

జ్యోతిష గణిత గ్రంథానికి ముందుమాట అవసరం లేదు. సరియైన గణిత సాధన చేయకుండా ఫలితాలను చెప్పలేమన్నది నిజం. హిందూ ఖగోళ శాస్త్రజ్ఞుడైన భాస్కరాచార్యుడు ఇంకా ముందుకు వెళ్లి గ్రహ గణితానికి సంబంధించిన ఖగోళశాస్త్ర విషయాలన్నింటినీ జ్యోతిష్యుడు కాదలచిన వ్యక్తి నేర్చుకుతీరాలని స్పష్టం చేసాడు.

"The Astrolobical Magazine" పాఠకుల కోరికమేరకు, చాలారోజుల నుండి నాపై పెట్టిన ఒత్తిడిని చూసిన తరువాత ఈ పుస్తకం యొక్క అవసరాన్ని గ్రహించాను. జాతకాల విశ్లేషణకు, ఫలితాలను చెప్పడానికి కావలసిన గ్రహ, భావముల బలములను సాధించటమెలాగో చెప్పటమే ఈ పుస్తకం ముఖ్య ఉద్దేశ్యం. ఇక్కడ జ్యోతిష విద్యార్థులకు ఒక హెచ్చరిక చేస్తున్నాను. ఏమిటంటే గణిత సాధన అవసరమే. కాని గణితంపై పూర్తిగా ఆధారపడి ఫలితాలను చెప్పాలనుకోవటం సరికాదు. దానివల్ల మనయొక్క ఫలితాలను విశ్లేషించే సహజమైన శక్తిని కోల్పోతాము. అందుచేత అవసరమైనంతవరకు మాత్రమే జ్యోతిష గణితాన్ని ఈ పుస్తకంలో ఇచ్చాము.

ఈ పుస్తకంలో అంతా శ్రీపతి పద్ధతిని అనుసరించాము. హిందూ ఖగోళ – జ్యోతిష పద్ధతులను అనుసరించి మనం ఫలితాలను చక్కగా అధ్యయనం చేయవచ్చు. ఉపయోగించవచ్చని నాకు పూర్తిగా నమ్మకం ఉంది. ఇదే విషయాన్ని నేను నా "A Manual of Hindu Astrology" ముందుమాటలో చర్చించాను. పాఠకుడు దానిని కూడా చదవాలి.



శీఘ్రోచ్చను కనుగొనటానికి ఉపయోగపడే పట్టికలు కేదార్‌నాథ్‌దత్ కలకత్తా "The Book of Fate" నుండి తీసుకొన్నాము. వారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకములో వివిధ బలాలను సాధించేటప్పుడు ఎక్కడైన 30సం॥ల కంటే తక్కువ వస్తే వానిని వదిలివేశాము.

పాఠకులకు జ్యోతిషశాస్త్ర ప్రాథమికాంశాలు, జాతక చక్రమును గుణించుట తెలియునని భావిస్తున్నాను. "A Manual of Hindu Astrology" పుస్తకాన్ని కూడా పాఠకుని వీలు కొరకు దగ్గర ఉంచుకోవటం మంచిది. ఈ పుస్తకంలో చాలా చోట్ల దాన్ని ప్రస్తావించాము.

పాఠకుల నుండి సూచనలను, సలహాలను, నా పొరపాట్లను తెలియ గోరతాను. తరువాత ముద్రణలలో వాటిని సరిచేసుకుంటాను.

1–6–1940 – **బి.వి. రామన్**

# 13వ ముద్రణకు ముందుమాట

అభిరుచి కల్గిన పాఠకుల ఉత్సాహ, సహకారాలతో, ఎక్కువ సాంకేతికం, గణితపరం అయిన ఈ పుస్తకం యొక్క 12వ ముద్రణ పూర్తిగా వారికి చేరిన తరువాత, వెంటనే ఈ ముద్రణ అవసరం ఏర్పడింది.

బహుశః ఇంగ్లీషు భాషలో మొదటగా గ్రహబలాల సాధనను గూర్చి సరళంగా, అర్థమైయ్యేట్టు రాసిన పుస్తకం నాదే కావచ్చును. 13వ ముద్రణను సంస్కరించి క్రొత్తగా తయారు చేసాము. ఇది నిజమైన జ్యోతిష జ్ఞానం పొందాలనుకునే వారికి చాలా విలువైన గ్రంథము.

నేను ఈ పుస్తకములో మా గ్రహింపుకు రాని తప్పులను తెలుప వలసిందిగా పాఠకులను ప్రార్థిస్తున్నాను.

1. 2. 1992 — బి. వి. రామన్

# షడ్బలములు

## ప్రవేశిక

**1. ఉదాహరణ జాతకము:**

మనం "A Manual of Hindu Astrology" పుస్తకం ద్వారా ఖగోళ, జ్యోతిష శాస్త్రాలను అనుసరించి జన్మకుండలిని ఎలా వేయాలో నేర్చుకున్నాం. అక్కడ మనం ఒక జాతకాన్ని ఉదాహ రణగా తీసుకొని వివిధ విషయాలను వివరించడం కోసం వివిధ సూత్రా లను తెలియచెప్పడం కోసం ఆ జాతకాన్ని వాడినాం. ఇక్కడ కూడ అదే జాతకాన్ని వివిధ రకాలైన బలాలను గణించడం కోసం వాడు తున్నాం.

**2. జనన వివరాలు :**

ఈ క్రింద ఇచ్చినటువంటి జాతక వివరాలు జ్యోతిష్య శాస్త్రపు గణితాన్ని వివరించటం కోసం చాలా అవసరం.

**3. జన్మస్థలం :**

స్త్రీ, $13^0$ ఉత్తర అక్షాంశము 5 గం॥ 10ని॥ 20 సెకన్లు తూర్పు రేఖాంశము.

**4. జనన కాలము మరియు తేది :**

2గం॥ 6ని॥ 16 సెకన్లు P.M. (స్థానిక కాలమానం) లేదా సూర్యోదయా నంతరం 20-32 ఘడియలు 16.10.1918 తారీఖున.

**5. ఇతర వివరాలు :**

సూర్యోదయం 5-54ని॥ A.M. (స్థానిక కాలమానం) లేదా 6 గం॥ 8ని॥లు A.M.(A.T.) నతం (పశ్చాత్‌నతం) 5-50 ఘడియలు అహస్సు 29-20 ఘడియలు.



**6. జన్మకాల నిరయన గ్రహస్థితి :**

హిందూ జ్యోతిష్యం నక్షత్రాలపై ఆధారపడి గ్రహాల స్థితులను అధ్యయనం చేస్తుంది. క్రింద మేము నిరయన స్థితులను (అయనాంశ తీసివేసి) ఉదాహరణ జాతకానికి ఇస్తున్నాము.

| గ్రహాలు | నిరయన స్థితి | | |
|---|---|---|---|
| | భాగ గం॥ | లిప్త ని॥ | విలిప్త సె॥ |
| సూర్యుడు | 180 | 53 | 55 |
| చంద్రుడు | 311 | 17 | 19 |
| కుజ | 229 | 30 | 34 |
| బుధ | 181 | 31 | 34 |
| గురు | 84 | 0 | 49 |
| శుక్ర | 171 | 9 | 56 |
| శని | 124 | 22 | 41 |
| రాహు | 234 | 23 | 47 |
| కేతు | 54 | 23 | 47 |

**7. కేంద్రాలు :**

ఉదాహరణ జాతకంలో

| | | |
|---|---|---|
| ఉదయ లగ్నము లేదా లగ్న భావము | 298 | 27 |
| అస్థ లగ్నము లేదా సప్తమ భావము | 118 | 27 |
| మధ్య లగ్నము లేదా దశమము | 216 | 30 |
| పాతాళ లగ్నము లేదా చతుర్థము | 36 | 30 |

**8. ఇతర భావాలు :**

వీటిని A Manual of Hindu Astrology లోని 88వ వివరణ ద్వారా, సూత్రాల ద్వారా కనుగొనవచ్చు.

**9. బలములు :**

గ్రహాలు తమ స్థితివల్ల, భావాలు భావస్థితి గ్రహం వల్ల భావంపై దృష్టిగల గ్రహంవల్ల కొన్నివిధములైన బలాన్ని అలాగే బలహీనతలను పొందు తాయి. గ్రహాలయొక్క మరియు భావాల నిజమైనటువంటి శక్తిని లేదా బలాన్ని తెలుసుకోవాలి అంటే, జ్యోతిశ్చక్రంలో వాటి స్థితిని వివిధ రకాలైన మార్గాల ద్వారా అంచనా వేయాలి. వివిధ రకాలైన ఈ శక్తులనే గ్రహ బలాలు అని పిలుస్తారు.

**10. షడ్బలములు :**

పరాశర పద్ధతి "6" రకాలైన బలములను వివరిస్తుంది. 1) స్థాన బలము 2) దిగ్బలము 3) కాలబలము, 4) చేష్టాబలము 5) నైసర్గిక బలము, 6) దృష్టిబలము. ఇలా బలాలను సాధించటం కోసం ఖగోళ జ్యోతిష్య శాస్త్ర సూత్రాలలో మంచి పరిజ్ఞానం అవసరం.

**11. షడ్బలాల ఉపయోగం :**

ఈ షడ్బలాల యొక్క ఉపయోగం జాతక పరిశీలనలో ఎన్నో విధాలుగా ఉంటుంది. ఆయుర్దాయ గణనం విషయంలో గ్రహ, భావ ఫలాలు, బలహీనతలు లెక్కలోకి తీసుకుంటాం. దశాంతర దశలను లెక్కించే టప్పుడు మనము, లగ్నము, సూర్యుడు మరియు చంద్రుడు ఈ మూడింటిలో బలవత్తరమైన దానికి మొదటి గ్రమ దశను కనుగొంటాం. లగ్నం బలమైనదా, సూర్యుడు బలమైనవాడా, ఇద్దరిలో ఎవరు ఎక్కువ బలవంతుడు అన్న విషయం వాటి బలాలను సాధించడం వల్ల మాత్రమే తెలుస్తుంది. వివిధ భావాలను అనుసరించి భవిష్యత్‌ను నిర్ణయించే టప్పుడు ఆభావాలయొక్క బలాలు ప్రాముఖ్యతను సంతరించుకొం టాయి. ఉదాహరణకు సూర్యదశలో చంద్ర భుక్తి యొక్క ఫలితాలను నిర్ణయించడానికి ఆ రెంటిలో ఏగ్రహంబలాన్ని కల్గిఉందో నిర్ణయించాలి. సూర్యుడు కనుక బలవంతుడు అయినట్లయితే ఫలితాలు సూర్యునిపై ఆధారపడి ఉంటాయి. అదే చంద్రుడు అధిక బలవంతుడు అయితే సూర్యుడు దశాధిపతి అయినా కూడా చంద్రుడు తన స్థితిని అనుసరించి ఫలితాలను ఇస్తాడు. ఎప్పుడయితే మనం షడ్బలాల సాధన సరిగ్గా చేస్తామో అపుడు వాటి ఆధారంగా భవిష్యత్‌ను చక్కటి ఆత్మవిశ్వాసంతో నిర్ణయించి చెప్పగలుగుతాం. మరో విధంగా చెప్పటం అంటే షడ్బల ములు ఒకరి జాతకంలోని భావాలు గ్రహాలకు సంబంధించిన ఆస్తులను – అప్పులను తెలియజేస్తాయి.



## భావాలపై గ్రహముల ప్రభావం

**భావస్థితి – బలము**

12. జాతక చక్రంలో వివిధ భావాలలో గ్రహాలు ఉండటం మనం గమ నిస్తాం. కొన్ని గ్రహాలు భావమధ్యమంలో ఉంటే ఇతర గ్రహాలు భావారంభంలో కాని, భావాంతంలో కాని ఉంటాయి. ఈ మూడు స్థితులలోను ఆయా భావాలోని గ్రహస్థితి ఒకే విధమైన ఫలితాన్ని ఇవ్వదు. కావున ఫలితాలలో తేడా ఉంటుంది. ఒక భావంలో ఉండటం వల్ల గ్రహం ఆ భావానికి ఎంత శక్తిని ఇస్తుంది? దీనిని మనం గ్రహం యొక్క భావస్థితి బలం అని చెపుతాం.

**13. భావసంధిలో గ్రహాలు :**

భావసంధి అంటే ఒక భావం అంతమై మరియొక భావం ఆరంభమయ్యే స్థానం. ఏదైనా గ్రహం ఈ స్థితిలో ఉన్నట్లయితే ఆ గ్రహం శక్తిహీన మవుతుంది. ఏ విధమైన ఫలితాలను ఇవ్వజాలదు.

**14. భావ మధ్యమంలోని గ్రహాలు :**

ప్రతి భావం యొక్క ప్రభావం ఆ భావం యొక్క ఆరంభ సంధి దగ్గర మొదలై భావ మధ్యమము వద్ద ఉన్నత స్థితిలో ఉంటుంది. భావ మధ్యమం నుంచి నెమ్మదిగా తగ్గుతూ భావ అంతంలో శూన్యం అవు తుంది. ఏదైనా గ్రహం భావమధ్యానికి భావ విరామ సంధికి (భావ అంత్యం) మధ్యలో కనుక పడినట్లయితే త్రైరాసికం ద్వారా బలాన్ని కనుగొనాలి. ఏ గ్రహం అయినా భావ సంధులలో శూన్య ఫలితాన్ని భావమధ్యమంలో పూర్తి ఫలితాన్ని ఇస్తాయి.

**15. ప్రభావాన్ని గణించడం :**

ఏ భావం పైన అయినా ఆ భావంలోని గ్రహం చూపే ఫలితాన్ని నిర్ణయించాలి అంటే ఆ భావం యొక్క పూర్వభాగాన్ని ఉత్తర భాగాన్ని లెక్కించాలి. గ్రహం ఏ భాగంలో ఉందో చూడాలి.

**16. స్థితి బల నిర్ణయం :**

గ్రహం పూర్వభాగంలో ఉన్నట్లయితే గ్రహం యొక్క స్థితి నుండి భావారంభాన్ని తీసివేయాలి. అదే గ్రహం కనుక ఉత్తర భాగంలో ఉన్నట్లయితే విరామ సంధి నుండి ఆ గ్రహాన్ని తీసివేయాలి. ఈ వచ్చిన శేషం, స్థితి బల పరిధి అవుతుంది. ఇలా వచ్చిన దానిని పూర్వ భాగం లేదా ఉత్తర భాగంచేత భాగించాలి. అంటే గ్రహం పూర్వభాగంలో ఉంటే అదేభాగంచేత ఉత్తరభాగంలో ఉంటే దాని చేత భాగించాలి. వచ్చిన ఫలితం భావస్థితి బలాన్ని ఇస్తుంది. పైన చెప్పిన దానిని క్లుప్తంగా వివరించవచ్చు.



**పూర్వ భాగ గ్రహము :**

అ) గ్రహ స్థితి – ఆరంభ సంధి = స్థితి బల పరిధి, ఆ) స్థితి బల పరిధి / భావ పూర్వభాగం = భావస్థితి బలము.

**ఉత్తరభాగ గ్రహం :**

అ) విరామ సంధి – గ్రహ స్థితి = స్థితి బల పరిధి ఆ) స్థితి బలము = స్థితి బల పరిధి / ఉత్తర భాగం.

**ఉదాహరణ 1) :**

ఈ జాతకంలోని గ్రహాలకు స్థితి బల పరిధిని కనుక్కోవాలి.

| గ్రహము | భావము | పూర్వభాగము లేదా ఉత్తర భాగం |
|---|---|---|
| రవి | నవమం | పూర్వ |
| చంద్ర | ప్రథమం | ఉత్తర |
| కుజ | దశమం | ఉత్తర |
| బుధ | నవమం | పూర్వ |
| గురు | షష్టమం | పూర్వ |
| శుక్ర | నవమం | పూర్వ |
| శని | సప్తమం | ఉత్తర |
| రాహు | ఏకాదశం | పూర్వ |
| కేతు | పంచమం | పూర్వ |



**పూర్వభాగంలోని గ్రహాల స్థితి బలపరిధి**

| గ్రహము | స్థితి | ఆరంభ సంధి | స్థితి బల పరిధి |
|---|---|---|---|
| రవి | $180^{0}$ 53’ 55” | $167^{0}$ 31’ 30” (నవమం) | $13^{0}$ 22’ 25” |
| బుధ | 181 31 34 | 167 31 30 (నవమం) | 14 0 4 |
| గురు | 84 0 49 | 77 31 30 (షష్టమం) | 6 29 19 |
| శుక్ర | 171 9 56 | 167 31 30 (నవమం) | 3 38 26 |
| రాహు | 234 23 47 | 230 14 30 (ఏకాదశం) | 4 9 17 |
| కేతు | 54 23 47 | 50 14 30 (పంచమం) | 4 9 17 |

**ఉత్తరభాగంలోని గ్రహాల స్థితి బలపరిధి**

| గ్రహం | విరామ సంధి | గ్రహాల స్థితి | స్థితి బల పరిధి |
|---|---|---|---|
| చంద్ర | $314^{0}$ 48’ 30” | $311^{0}$ 17’ 19” (ప్రథమ) | $3^{0}$ 31’ 11” |
| కుజ | 230 14 30 | 229 30 34 (దశమం) | 0 43 56 |
| శని | 134 48 30 | 124 22 41 (సప్తమ) | 10 25 49 |

ఉదామరణ -2 :

ఉదాహరణ జాతకంలోని వివిధ రాశులలోని గ్రహాలకు భావస్థితి బలాన్ని కనుగొనండి?

$$\text{స్థితి బలము} = \frac{\text{స్థితి బలపరిధి}}{\text{భావపూర్వ లేదా ఉత్తరభాగం}}$$

గ్రహం పూర్వభాగంలో ఉంటే పూర్వభాగం, ఉత్తరభాగంలో ఉత్తరభాగం.

| | | | | |
|---|---|---|---|---|
| రవి | 13 22 24 / 16 21 30 | = | 0.80 | రూపాలు |
| చంద్ర | 3 31 11 / 16 21 30 | = | 0.24 | రూపాలు |
| కుజ | 0 43 56 / 13 38 30 | = | 0.11 | రూపాలు |
| బుధ | 14 0 4 / 16 21 30 | = | 0.89 | రూపాలు |
| గురు | 6 29 19 / 13 38 30 | = | 0.48 | రూపాలు |
| శుక్ర | 3 38 26 / 16 21 30 | = | 0.22 | రూపాలు |
| రాహు | 4 9 17 / 13 38 30 | = | 0.30 | రూపాలు |
| కేతు | 4 9 17 / 13 38 30 | = | 0.30 | రూపాలు |
| శని | 10 25 49 / 16 21 30 | = | 0.64 | రూపాలు |



**17. స్థితిబలం యొక్క ఉపయోగం :**

ఈ బలం ద్వారా మన గ్రహం తన దశాకాలంలో భావంలో ఉండటం ద్వారా ఫలితాన్ని ఇచ్చే ఆ ఫలితం యొక్క పరిమాణాన్ని తెలియచేస్తుంది. మరో సందర్భంలో దీని ఉపయోగం గురించి చర్చిద్దాం. సాధారణంగా ఇది గ్రహం యొక్క దశలో కాని, భుక్తిలో కనిపిస్తుంది. ఈ బలం భావంపై ఇతర గ్రహాల దృష్టులు, భావం యొక్క బలం, కొన్ని ప్రత్యేక రాశులలో గ్రహాల స్థితి, యోగకారక గ్రహాలు మొదలైన వాటిపై ఆధారపడి పనిచేస్తుంది. మన ఉదాహరణ జాతకంలో గురుడు ఆరోభావం యొక్క ఫలితాన్ని 0.48 రూపాలు ఇస్తాడు.



మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

## స్థాన బలము

**18.** 10వ పేరాలో మనం 6 విధాల బలాలను గూర్చి తెలిపాం. వాటిలో మొదటిది "స్థానబలం" ఒక గ్రహం ఏదైనా రాశిలో తన మిత్ర, శత్రు సమవర్గాలలో ఉండవచ్చు. ఉచ్చను పొంది వుండవచ్చును. నీచ కావచ్చును. తన స్వవర్గులో కాని, మూలత్రికోణం కాని అయి ఉండవచ్చు. పైవన్నీ కూడా గ్రహంయొక్క స్థానాన్ని సూచిస్తాయి. అంతేకాక ఆ స్థానంపై ఆధారపడి ఆ గ్రహం యొక్క బలాన్ని నిర్ణయిస్తాయి. దీన్ని మన "స్థానబలం" అంటాం. స్థానబలం 1) ఉచ్ఛ బలము, 2) సప్తవర్గజ బలము, 3) ఓజయుగ్మ రాశ్యంశ బలము, 4) కేంద్ర బలము, 5) ద్రెక్కాణ బలములను ఉపాంగాలుగా కల్గి ఉంటుంది.

**19. బలాల కొలమానము :** గ్రహబలాన్ని రూపాలలో (యూనిట్స్‌లో) కొలుస్తారు. ఒక రూపము = 60 షష్ట్యంశలు.

**20. ఉచ్ఛ బలము:** ఉచ్ఛ స్థాన స్థితివల్ల వచ్చే బలము ఇది. ప్రతి గ్రహానికి జ్యోతిశ్చక్రంలో ఉచ్ఛ భాగాలు ఉంటాయి. గ్రహం కనుక ఆ ఉచ్ఛ భాగంలో ఉన్నట్లయితే ఒక రూపము లేదా 60 షష్ట్యంశల బలము కల్గి ఉంటుంది. తన నీచభాగంలో ఉన్నప్పుడు గ్రహం యొక్క ఉచ్ఛ బలము శూన్యము. నీచభాగం నుండి ఉచ్ఛ భాగాల వైపుగా ఉచ్ఛబలము నెమ్మదిగా పెరుగుతూ వెళుతుంది. ఉచ్ఛభాగం నుంచి నీచ భాగాల వైపు దీనికి వ్యతిరేకదిశలో నెమ్మదిగా తగ్గుతుంది. మహర్షి పరాశరుడు ఈ క్రింది శ్లోకంలో ఇలా వివరించినాడు.





नीचोनन्तु ग्रहं सार्धाधिके चत्राब्दिशोधयेत् ।
भगकृत्व त्रिमिर्भक्तं फलमुच्चबलं भवेत् ॥

గ్రహస్థితిని నీచస్థానం చేత తగ్గించగా వచ్చిన శేషం 180 భాగాలకంటే ఎక్కువ ఉన్నట్లయితే 360 నుండి ఆ శేషాన్ని తీసివేసి వచ్చినదానిని 3చే భాగించాక ఫలితం ఆ గ్రహానికి సంబంధించిన ఉచ్ఛబలాన్ని షష్ట్యంశలు లేదా విరూపములలో సూచిస్తుంది.

అంటే $\frac{\text{గ్రహస్తితి – నీచస్థానం} \times 60}{180}$

$= \frac{\text{గ్రహస్థితి – గ్రమ నీచస్థానం}}{3}$

ఉదాహరణ – 3 : ఉదాహరణ జాతకంలోని గ్రహములకు ఉచ్ఛబలమున కనుగొనండి?

| గ్రహం | గ్రహస్థితి | నీచ భాగములు | వ్యవధి | ఉచ్ఛబలము |
|---|---|---|---|---|
| | 0 ' " | 0 | 0 ' " | 0 ' " |
| రవి | 180 53 55 – | 190 = | 9 6 5 | $\frac{9-6-5}{3}$ = 3.00 |
| చంద్ర | 311 17 19 – | 213 = | 98 17 19 | $\frac{98-17-19}{3}$ = 32.75 |
| కుజ | 229 30 34 – | 118 = | 111 30 34 | $\frac{111-30-34}{3}$ =37.6 |
| బుధ | 181 31 34 – | 345 = | 163 28 26 | $\frac{163-28-26}{3}$ =54.5 |
| గురు | 84 0 49 – | 275 = | 160 0 49 | $\frac{169-0-49}{3}$ = 56.33 |
| శుక్ర | 171 9 56 – | 177 = | 5 50 4 | $\frac{5-50-4}{3}$ = 1.95 |
| శని | 124 22 41 – | 20 = | 104 22 41 | $\frac{104-22-41}{3}$ = 34.08 |

21. మూల త్రికోణాది బలములను ఏ గ్రహమునకైతే లెక్కిస్తున్నామో ఆ గ్రహానికి ఇతర గ్రహాలకు మధ్యగల సంబంధాన్ని ఆ సంబంధం యొక్క స్వభావాన్ని ఆ గ్రహానికి వర్గానికి మధ్యగల సంబంధాన్ని పరిగణనలోకి తీసుకోవాలి.

**22. సంబంధాలు :** గ్రహములు తమలో తాము సంబంధాలు కల్గి ఉంటాయి. అవి వర్గములతో, భావాలతో సంబంధాన్ని కల్గి ఉంటాయి. అంటే గ్రహాలు లేదా భావాలు మూడు విధములైన సంబంధములను కల్గి, వాటి శక్తి వృద్ధి చెందుట లేదా క్షయం అవటం జరుగుతుంది. ఒక జాతకాన్ని విశ్లేషించేటప్పుడు వివిధ రకాలైన సంబంధాలను చక్కగా అర్థం చేసుకోవాలి. ఎందుకంటే షడ్‌బల సాధనలోను, ఆయుర్ధాయ గణనలోను ఇవి ప్రభావాన్ని కల్గి ఉంటాయి.

**23.గ్రహముల మధ్య సంబంధాలు :** గ్రహాలలో కొన్ని గ్రహాలు మిగిలిన గ్రహాలకు మిత్ర, శత్రు సమ గ్రహాలు అవుతూ ఉంటాయి. గ్రహాల మధ్య సంబంధము రెండు విధములు. అవి 1) నైసర్గికము, 2) తాత్కాలికము.

**24.నైసర్గికము :** స్వాభావికం, ఒక గ్రహం తన స్వభావానికి అనుకూలంగా వేరొక గ్రహానికి మిత్రుడుగా కాని శత్రువుగా గాని లేదా సముడుగా కాని ఉండవచ్చు. ఈ సంబంధం పరస్పర గౌరవాలపై ఆధారపడదు. తన మిత్రగ్రహం యొక్క కిరణాల చేత గ్రహ కిరణాలు ఉత్తేజితం అవుతాయి. శత్రు గ్రహ కిరణాలచే బలహీనమౌతాయి. అన్ని జాతకాలకు కూడా స్వాభావిక సంబంధం ఒకే విధంగా ఉంటుంది. మనం శుక్రుడు రవికి శత్రువు అని చెప్పడం ద్వారా ఈ రెండు గ్రహాల కిరణాలు ఒకదానికి ఒకటి వ్యతిరేకంగా పనిచేసి ఎదుటి వాటిని బలహీన పరుస్తాయి. గ్రహాల స్వాభావిక సంబంధాలను తెలియచేసే పట్టికను దిగువ ఇస్తున్నాం.





## స్వాభావిక సంబంధం

| గ్రహాలు | మిత్రులు | సములు | శత్రువులు |
|---|---|---|---|
| రవి | చంద్ర, కుజుడు, గురువు | బుధుడు | శుక్రుడు, శని |
| చంద్రుడు | బుధుడు | కుజుడు, గురుడు, శుక్రుడు, శని | – |
| కుజుడు | రవి, చంద్ర, గురువు | శుక్రుడు, శని | బుధుడు |
| బుధుడు | రవి, శుక్రుడు | గురువు, కుజుడు, శని | చంద్రుడు |
| గురుడు | రవి, చంద్ర, కుజుడు | శని | బుధుడు, శుక్రుడు |
| శుక్రుడు | బుధుడు, శని | కుజుడు, గురుడు | రవి, చంద్రుడు |
| శని | బుధుడు,శుక్రుడు | గురుడు | రవి, చంద్రుడు కుజుడు |

స్థానబలాన్ని గణించుటకు నైసర్గిక సంబంధాలను చక్కగా అర్థం చేసుకొని ఉండాలి. నైసర్గిక సంబంధాలను పూర్తిగా తెలుసుకున్న తరువాత తాత్కాలిక సంబంధాలను నేర్చుకోవాలి.

**25.తాత్కాలికము :**

జననకాల గ్రహస్థితిపై ఆధారపడి ఏర్పడే గ్రహాల సంబంధమే తాత్కాలిక సంబంధము. ప్రతి గ్రహానికి తాను ఉన్న స్థానం నుండి 2, 3, 4, 10, 11 మరియు 12 స్థానాల యందున్న గ్రహాలు తాత్కాలిక మిత్రులు. ఇతర స్థానముల యందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు.

ఉదాహరణ –4 :

ఉదాహరణ జాతకంలోని గ్రహములను తాత్కాలిక మిత్ర, శత్రు గ్రహాలను కనుగొనండి.

| గ్రహం | తాత్కాలిక మిత్రత్వం | తాత్కాలిక శత్రుత్వం |
|---|---|---|
| రవి | కుజ, శని, శుక్ర | చంద్ర, బుధ, గురు |
| చంద్ర | కుజ | రవి, బుద, గురు,శుక్ర,శని |
| కుజ | రవి, చంద్ర, బుధ, శుక్ర, శని | గురు |
| బుధ | శుక్ర, శని, కుజ | చంద్ర, గురు, రవి |
| గురు | శుక్ర, శని | చంద్ర, కుజ, బుధ, రవి |
| శుక్ర | కుజ, బుధ, గురు, శని రవి | చంద్ర |
| శని | రవి, కుజ, బుధ, గురు | చంద్ర |

**26. సంయోగ సంబంధాలు :**

తాత్కాలిక మిత్రుడు నైసర్గిక మిత్రుడు కూడా అయినట్లయితే అతడు "అధిమిత్రుడు" అని పిలువబడుతాడు. తాత్కాలిక మిత్రుడు, నైసర్గిక శత్రువు లేదా తాత్కాలిక శత్రువు, నైసర్గిక మిత్రుడు అయితే సముడు అవుతాడు. నైసర్గికంగా, తాత్కాలికంగాను కూడా శత్రువు అయితే అధిశత్రువు అంటారు. ఈ విధంగా నైసర్గిక తాత్కాలిక సంబంధాలు క్రింద చూపినట్లు ఉంటాయి.

1. తాత్కాలిక మిత్రుడు + నైసర్గిక మిత్రుడు = అధిమిత్రుడు
2. తాత్కాలిక మిత్రుడు + నైసర్గిక శత్రువు = సమ
3. తాత్కాలిక మిత్రుడు + నైసర్గిక సమ = మిత్ర
4. తాత్కాలిక శత్రువు + నైసర్గిక శత్రు = అధిశత్రువు



5. తాత్కాలిక శత్రువు + నైసర్గిక మిత్ర = సమ
6. తాత్కాలిక శత్రువు + నైసర్గిక సమ = శత్రువు

పై పట్టికను చూస్తే రెండు గ్రహాల మధ్య సంబంధం అధిమిత్ర, మిత్ర, సమ, శత్రు, అధిశత్రు అనే ఐదు విధాలుగా ఉంటుందని తెలుస్తుంది. శత్రుత్వ, మిత్రత్వములలోని ఈ స్థితులను జాగ్రత్తగా ప్రతి గ్రహానికి కనుక్కోవాలి.

**ఉదాహరణ – 5 :** గ్రహముల సంయోగ సంబంధాలను ఉదాహరణ జాతకమునకు కనుగొనుము.

| గ్రహం | అధిమిత్ర | మిత్ర | సమ | శత్రు | అధిశత్రు |
|---|---|---|---|---|---|
| రవి | కుజ | | గురు చంద్ర శని శుక్ర | బుధ | – |
| చంద్ర | – | కుజ | బుధ రవి | శుక్ర గురు శని | |
| కుజ | రవి చంద్ర | శని శుక్ర | గురు బుధ | – – | – |
| బుధ | శుక్ర | కుజ శని | రవి | గురు | చంద్ర |
| గురు | – | శని | శుక్ర చంద్ర కుజ రవి | – | బుధ |
| శుక్ర | బుధ శని | కుజ గురు | రవి | – | చంద్ర |
| శని | శుక్ర బుధ | గురు | కుజ రవి | – | చంద్ర |

## 27. గ్రహాలు మరియు వర్గములు :

మనం “A Manual of Hindu Astrology ” ద్వారా వివిధ వర్గాలకు అధిపతులను వర్గీకరించటం ఎలాగో తెలుసుకున్నాం. ఆ విధంగా గ్రహాలకు వర్గాల మధ్య సంబంధాన్ని మనం గమనించాం. ఉదాహరణ జాతకంలోని చంద్రుడు కుంభరాశిలో ఉన్నాడు. ఆ రాశికి అధిపతి “శని”. శని చంద్రునకు శత్రువు అంటే చంద్రుడు శత్రుక్షేత్రంలో లేదా శత్రువర్గంలో ఉన్నాడని అర్థం. ఏ గ్రహం అయినా తన వర్గంలో ఉన్నట్లయితే స్వవర్గంలో ఉన్నది అని చెబుతాం. శత్రువు వర్గంలో ఉంటే శత్రువర్గం అని, మిత్రుని వర్గంలో అయితే మిత్రవర్గం అని అలాగే ఒక వర్గం అధిశత్రు వర్గమా,అధిమిత్ర వర్గమా అన్నది నిర్ణయించాలి. దీని ద్వారా స్థానబలంలోని ఉపాంగము అయిన సప్తవర్గజ బలాన్ని కనుక్కోవచ్చు.

**ఉదాహరణ – 6 :** ఉదాహరణ జాతకంలోని గ్రహములు, వర్గుల సంబంధాన్ని నిశ్చయించండి.

| గ్రహం | రాశి | హోరా | ద్రేక్కాణం | సప్త మాంశ | నవాంశ | దశ మాంశ | |
|---|---|---|---|---|---|---|---|
| రవి | సమ | స్వ | సమ | సమ | సమ | సమ | అధిమిత్ర |
| చంద్ర | శత్రు | సమ | సమ | మిత్ర | శత్రు | సమ | శత్రువు |
| కుజ | స్వ | అధి మిత్ర | సమ | సమ | సమ | సమ | సమ |
| బుధ | అధి మిత్ర | సమ | అధి మిత్ర | అధి మిత్ర | అధి మిత్ర | అధి మిత్ర | మిత్ర |
| గురు | అధి శత్రు | సమ | మిత్ర | సమ | సమ | స్వ | అధి శత్రు |
| శుక్ర | అధి మిత్ర | సమ | సమ | అధి శత్రు | అధి శత్రు | స్వ | అధి మిత్ర |
| శని | సమ | సమ | సమ | అధి మిత్ర | అధి మిత్ర | అధి మిత్ర | సమ |



## 28. స్వవర్గమందలి గ్రహాలు :

ఏ గ్రహం అయినా ఒకటి కంటే స్వవర్గలను పొందినట్లయితే అది గొప్ప శుభాన్ని, విశేషమైనటువంటి ఫలితాన్ని ఇస్తుందని చెబుతారు.

**ఒక గ్రహం తన స్వవర్గను**

| | |
|---|---|
| రెండుసార్లు పొందితే | పారిజాతాంశ |
| మూడుసార్లు పొందితే | పర్వతాంశ |
| నాలుగుసార్లు పొందితే | సింహాసనాంశ |
| అయిదుసార్లు పొందితే | స్వర్గబలాంశ |
| ఆరుసార్లు పొందితే | ఇంద్రాంశ |
| ఏడుసార్లు పొందితే | రాజపదమాంశ |
| ఎనిమిదిసార్లు పొందితే | గోపురాంశ |
| తొమ్మిదిసార్లు పొందితే | బ్రహ్మపదమాంశ |
| పదిసార్లు పొందితే | వైష్ణవాంశ |
| పదకొండుసార్లు పొందితే | శైవాంశ |
| పన్నెండుసార్లు పొందితే | వైశేషికాంశ |

**ఉదాహరణ –7 :** ఉదాహరణ జాతకంలో ఏవైనా స్వవర్గులు ఉన్న ఎడల తెలియచేయండి.

| గ్రహం | స్వవర్గంలో | అంశ |
|---|---|---|
| శుక్రుడు | రెండుసార్లు | పారిజాతాంశ |

ఇతర గ్రహములు అన్ని స్వవర్గులో ఒక్కసారి మాత్రమే ఉన్నాయి అందుచేత వీటికి ప్రత్యేకమైన అంశలు ఏవీ లేవు

**29. గ్రహాలు మరియు భావాలు :** భావ మధ్యమం ఏ రాశిలో అయితే పడుతుందో ఆ రాశ్యాధిపతి భావాధిపతి అవుతాడు. భావాధిపతి భావబలాన్ని నిర్ణయించటంలో ప్రముఖ పాత్ర వహిస్తాడు.

**ఉదాహరణ - 8 :** ఉదాహరణ జాతకంలోని గ్రహములను భావములకు గల సంబంధాన్ని కనుగొనండి.

| భావం | భావమధ్య | | | రాశి | అధిపతి |
|---|---|---|---|---|---|
| I | తను | 298 | 27 | మకర | శని |
| II | ధన | 331 | 10 | మీనం | గురు |
| III | భాతృ | 3 | 53 | మేషం | కుజ |
| IV | మాతృ | 36 | 36 | వృషభం | శుక్ర |
| V | పుత్ర | 63 | 53 | మిధునం | బుధ |
| VI | శత్రు | 91 | 10 | కర్కాటకం | చంద్ర |
| VII | కళత్ర | 118 | 27 | కర్కాటకం | చంద్ర |
| VIII | ఆయు | 151 | 10 | కన్య | బుధ |
| IX | భాగ్యం | 183 | 53 | తుల | శుక్ర |
| X | కర్మ | 216 | 36 | వృశ్చికం | కుజ |
| XI | లాభ | 243 | 53 | ధనుస్సు | గురు |
| XII | వ్యయ | 271 | 10 | మకరం | శని |

పై పట్టికలో చూస్తే రెండు భావాలు ఒకే రాశిలో పడటం కనిపిస్తుంది. అప్పుడు ఆ రెండు భావాలకు కూడా ఆ రాశి అధిపతి అయిన గ్రహమే అధిపతి అవుతాడు. ఇది సాధారణంగా భూమధ్యరేఖ ప్రాంతంలో చాలా తక్కువ.

**30. సప్తవర్గజ బలము :** ఒక గ్రహం వివిధ వర్గాలలో ఉండటం ద్వారా కొంత బలాన్ని సాధించడం మనం చూసాం. స్థానబలం అనేది నిజానికి వర్గంలో ఉన్న గ్రహానికి వర్గం యొక్క అధిపతికి సంబంధించినది. ఒక గ్రహం స్వవర్గాన్ని కాని మిత్రవర్గాన్ని కాని లేదా శత్రువర్గాన్ని కాని లేదా సమవర్గాన్ని కాని లేదా మూల త్రికోణాన్ని కాని పొంద వచ్చు.



మూల త్రికోణంలో ఉన్న గ్రహానికి 45 షష్ట్యంశల బలం, స్వర్గంలో ఉంటే 30 షష్ట్యంశలు అధిమిత్రవర్గంలో ఉంటే 22.5 షష్ట్యంశలు, మిత్రవర్గంలో 15, సమవర్గంలో 7,5 శత్రువర్గంలో 3,75, అధిశత్రువర్గంలో 1,875 బలాన్ని ఇచ్చేదిగా వర్గీకరించారు. మూల త్రికోణరాశిలో ఉంటే మాత్రమే గ్రహానికి 45 షష్ట్యంశలను బలంగా నిర్ణయించాలి. అంతేకాని ఇతర 6 వర్గాలలో ఉంటే ఇవ్వరాదు. సూర్యుడు సింహరాశిలో ఉండి నవాంశ కూడా సింహమే అయితే ఆ సూర్యునికి రాశివర్గంలో 45 షష్ట్యంశలను ఇవ్వాలి. మిగిలిన వర్గాలలో ఇవ్వరాదు. ఒక గ్రహాన్ని తీసుకొని సప్తవర్గముల అధిపతులతో దాని సంబంధాన్ని పరీక్షించాలి. రాశిలో కనుక ఆ గ్రహం మూల త్రికోణంలో ఉంటే 45 షష్ట్యంశలను ఇవ్వాలి. అదేవిధంగా ఇతర వర్గులలో ఆ గ్రహం వాటితో ఏవిధంగా సంబంధం కల్గి ఉందో దానిపై ఆధారపడి బలాన్ని నిర్ణయించాలి. అన్నింటిని కలిపితే మనం తీసుకున్న గ్రహం యొక్క మూల త్రికోణాది బలము వస్తుంది. ఈ గణిత సాధనకు ముందుగానే మనం గ్రహాలు-వర్గాలు మధ్యగల సంబంధాన్ని పట్టిక రూపంలో తయారుచేసుకొని ఉంచుకోవాలి. (A Manual of Hindu Astrology Para 136)

**ఉదాహరణ - 9 :** ఉదాహరణ జాతకంలోని సూర్యుని సప్తవర్గజ బలాన్ని కనుగొందాం. ఉదాహరణ 6లోని పట్టికను అనుసరించి చూస్తే రాశిలో సూర్యుడు సమవర్గంలో ఉన్నాడు.

రాశిలో సమవర్గం = 7.5 షష్ట్యంశలు
హోరలో స్వవర్గు = 30 షష్ట్యంశలు
ద్రేక్కాణంలో సమవర్గు = 7.5 షష్ట్యంశలు
సప్తమాంశలో సమవర్గు = 7.5 షష్ట్యంశలు
నవాంశలో సమవర్గు = 7.5 షష్ట్యంశలు
ద్వాదశాంశలో సమవర్గు = 7.5 షష్ట్యంశలు

త్రింశాంశలో అధిమిత్రవర్గు = 22.5 షష్ట్యంశలు

వీటన్నింటిని కూడితే రవి యొక్క సప్తవర్గజ బలం 90 షష్ట్యంశలు లేదా 1.5 రూపాలు వస్తుంది.

ఇతర గ్రహాల సప్తవర్గజ బలాన్ని క్రింది పట్టికలో ఇస్తున్నాము.

| గ్రహం | రాశి | హోరా | ద్రెక్కాణం | సప్తాంశ | నవాంశ | దశాంశ | త్రింశాంశ | మూల త్రికోణం |
|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 7.500 | 30.000 | 7.500 | 7.500 | 7.500 | 7.500 | 22.500 | 90.000 |
| చంద్ర | 3.750 | 7.500 | 7.500 | 15.000 | 3.500 | 7.500 | 3.500 | 49.750 |
| కుజ | 30.000 | 22.500 | 7.500 | 7.500 | 7.500 | 7.500 | 7.500 | 90.000 |
| బుధ | 22.500 | 7.500 | 22.500 | 22.500 | 22.500 | 22.500 | 15.000 | 135.00 |
| గురు | 1.875 | 7.500 | 15.000 | 7.500 | 7.500 | 30.000 | 1.875 | 71.250 |
| శుక్ర | 22.500 | 7.500 | 30.000 | 1.875 | 1.875 | 30.000 | 22.500 | 116.25 |
| శని | 7.500 | 7.500 | 7.500 | 22.500 | 22.500 | 22.500 | 7.500 | 97.500 |

**31. ఓజయుగ్మరాశ్యంశ బలము :** ఈ బలాన్ని గ్రహాల యొక్క బేసి, సరి రాశులలో స్థితి, నవాంశ స్థితిని బట్టి నిర్ణయిస్తాం. కొన్ని గ్రహాలు బేసి, రాశులు, బేసి రాశుల నవాంశలలో ఉండటం ద్వారా బలాన్ని పొందుతాయి. ఇతర గ్రహాలు సరిరాశి, సరిరాశి నవాంశలలో ఉండటం ద్వారా బలాన్ని పొందుతాయి. ఆయా గ్రహాలు ఆ రాశి నవాంశలలో ఉండటం వల్ల వాటికి బలాన్ని నిర్ణయిస్తాం.

శుక్ర, చంద్రులు సరిరాశి, సరి నవాంశలలో ఉండటం వలన 15 షష్ట్యంశలు బలాన్ని పొంతుతారు. సూర్య, కుజ, గురు, బుధ, మరియు శని గ్రహాలు బేసి రాశి, నవాంశలో ఉండటం వల్ల పై బలాన్ని పొందుతారు. ఉదాహరణకు చంద్రుడు సరిరాశి, సరి నవాంశలో ఉంటే ఆ గ్రహం 15 + 15 = 30 షష్ట్యంశలు బలాన్ని పొందుతుంది. దీనినే మనం ఓజయుగ్మరాశ్యంశ బలము లేదా యుగ్మ యుగ్మ బలం అని పిలుస్తాం.

**ఉదాహరణ - 10 :** ఉదాహరణ జాతకంలోని గ్రహములు ఓజయుగ్మరాశ్యంశ బలములను కనుగొనుము. సూర్యుడు తులలో, బేసిరాశిలో, మొదటి నవాంశలో (తులానవాంశ) ఉన్నాడు. అంటే



సూర్యునికి 30 షష్ట్యంశలు బలం లభించింది. ఈ క్రింది పట్టికలో మిగిలిన గ్రహాల బలాన్ని ఇస్తున్నాం.

| గ్రహం | రాశి | నవాంశ | రాశి బలం | నవాంశ బలం | యుగ్మ యుగ్మ బలం |
|---|---|---|---|---|---|
| రవి | బేసి | బేసి | 15.0 | 15.0 | 30.0 |
| చంద్ర | బేసి | సరి | 0.0 | 15.0 | 15.0 |
| కుజ | సరి | బేసి | 0.0 | 15.0 | 15.0 |
| బుధ | బేసి | బేసి | 15.0 | 15.0 | 30.0 |
| గురు | బేసి | సరి | 15.0 | 0.0 | 15.0 |
| శుక్ర | సరి | సరి | 15.0 | 15.0 | 30.0 |
| శని | బేసి | సరి | 15.0 | 0.0 | 15.0 |

**32. కేంద్ర బలం :** కేంద్రంలో ఉన్న గ్రహం 60 షష్ట్యంశలు ఫనపరములలో ఉన్న గ్రహం 30 షష్ట్యంశలను, అపోక్లీమములో ఉన్న గ్రహం 15 షష్ట్యంశల బలం కల్గి వుంటాయి. రాశి వర్గంలో మాత్రమే దీనిని లెక్కించాలి.

**33. కేంద్రాలు :** ఇవి 1, 4, 7, 10 భావాలు. ఈ విషయంలో వివిధ అభిప్రాయాలు ఉన్నాయి. మొదటిది 1, 4, 7, 10 రాశులు, రెండవది 1, 4, 7, 10 భావాలు. పరాశరుడు వీటిని రాశులుగా లెక్కిస్తే, శ్రీపతి వ్యాఖ్యాత మరియు హోరారత్న గ్రంధ రచయిత బలభద్రుడు భావాలను సమర్ధిస్తాడు. ఈ విషయంలో శ్రీపతి ఏమి చెప్పాడో, మనకు సరిగా తెలియదు కాబట్టి ఇక్కడ పరాశరుని అనుసరించి రాశులను కేంద్రాలుగా స్వీకరిస్తున్నాం.

**34. ఫనపరములు :** కేంద్ర రాశుల తరువాత రాశులు ఫనపరములు. అవి 2, 5, 8 మరియు 11 రాశులు.

**35. అపోక్లీమములు :** ఇవి ఫనపరముల తరువాత రాశులు, అంటే 3, 6, 9, 12.

**ఉదాహరణ - 11 :** ఉదాహరణ జాతకంలోని గ్రహముల కేంద్ర బలాన్ని కనుక్కోండి.

| గ్రహము | కేంద్ర లేదా ఫనపరం లేదా అపోక్లీమము | కేంద్ర బలం |
|---|---|---|
| రవి | కేంద్ర | 60.000 |
| చంద్ర | ఫనపర | 30.000 |
| కుజ | ఫనపర | 30.000 |
| బుధ | కేంద్ర | 60.000 |
| గురు | అపోక్లీమం | 15.000 |
| శుక్ర | అపోక్లీమం | 15.000 |
| శని | ఫనపర | 30.000 |

**36. ద్రెక్కాణ బలం :**

గ్రహాలను స్త్రీ, పురుష, నపుంసక గ్రహాలుగా వర్గీకరించారు. పురుష గ్రహం రాశి యొక్క 1వ ద్రెక్కాణంలోను నపుంసక గ్రహం రాశి మధ్య ద్రెక్కాణంలోను స్త్రీ గ్రహం రాశి చివరి ద్రెక్కాణంలోను 15 షష్ట్యంశల ద్రెక్కాణ బలాన్ని పొందుతాయి.

**37. పురుష గ్రహాలు :** రవి, గురు, కుజలు.

**38. నపుంసక గ్రహాలు :** శని, మరియు బుధుడు.

**39. స్త్రీ గ్రహాలు :** చంద్ర, శుక్రులు.

**ఉదాహరణ - 12 :**

ఉదాహరణ జాతకంలోని గ్రహాలకు ద్రెక్కాణ బల సాధన.



| గ్రహం | స్త్రీ లేదా పురుష | ద్రెక్కాణం | ద్రెక్కాణ బలం |
|---|---|---|---|
| రవి | పురుష | మొదటి | 15.00 |
| చంద్ర | స్త్రీ | రెండవ | 0.0 |
| కుజ | పురుష | రెండవ | 0.0 |
| బుధ | నపుంసక | మొదటి | 0.0 |
| గురు | పురుష | మూడవ | 0.0 |
| శుక్ర | స్త్రీ | మూడవ | 15.0 |
| శని | నపుంసక | మొదటి | 0.0 |



**40. సంపూర్ణ స్థానబలం :**

పైన లెక్కించినటువంటి 5 ఉపబలాల మొత్తాన్ని కూడితే స్థానబలం మొత్తాన్ని కనుక్కోవచ్చు.

**ఉదాహరణ 13 :** జాతకంలోని గ్రహాలకు సంపూర్ణ స్థానబలాన్ని లెక్కించండి.

| గ్రహాలు | రవి | చంద్ర | కుజుడు | బుధుడు | గురుడు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| ఉచ్ఛబలం | 3.00 | 32.75 | 37.060 | 54.500 | 56.330 | 1.950 | 34.800 |
| సప్తవర్గజబలం | 90.000 | 48.75 | 90.000 | 135.000 | 71.250 | 116.250 | 97.500 |
| ఓజయుగ్మ రాశ్యాంశబలం | 30.000 | 15.000 | 15.000 | 30.000 | 15.000 | 30.000 | 15.000 |
| కేంద్రబలం | 60.000 | 30.000 | 30.000 | 60.000 | 15.000 | 15.000 | 30.000 |
| ద్రెక్కాణ బలం | 15.000 | - | - | - | - | 15.000 | - |
| సంపూర్ణ స్థానబలం | 198.000 | 126.500 | 172.060 | 279.500 | 157.580 | 178.200 | 177.30 |

## దిగ్బలం

**41. దిగ్బలం :**

గ్రహాలు జాతక చక్రంలో వివిధ దిక్కులలో ఉండటం ద్వారా ఈ బలాన్ని పొందుతాయి.

**42. దిశలు :**

లగ్నం తూర్పును, దశమం దక్షిణాన్ని, సప్తమం పడమరను, చతుర్థం ఉత్తరాన్ని సూచిస్తాయి.

**43. గ్రహాలు, దిశలు :**

ప్రతి గ్రహం ఒక్కో దిశలో బలాన్ని కల్గి ఉంటుంది. లగ్నంలో ఉండటం ద్వారా గురు బుధులు పూర్తి బలాన్ని కల్గి ఉంటారు. రవి, కుజలు దక్షిణంలో అంటే దశమంలో దిగ్బలాన్ని కల్గి ఉంటారు. సప్తమంలో ఉన్న శని దిగ్బలంకల్గి ఉంటాడు. చంద్ర, శుక్రులు 4వ భావంలో ఉంటూ ఉత్తరదిశలో ఉండటం వల్ల పూర్తి దిగ్బలాన్ని కల్గి ఉంటారు.

**44. దిగ్బల పరిధి :**

పైన మనం కొన్ని గ్రహాలు కొన్ని దిక్కులలో పూర్తి దిగ్బలాన్ని కల్గి ఉంటాయని చూశాం. దీని ద్వారా మనికి దిగ్బలం లేని కొన్ని శక్తిహీనమైనటువంటి స్థానాలు కూడా ఉంటాయని తెలుస్తుంది. ఉదాహరణకు సూర్యుడు 10వ భావంలో దిగ్బలాన్ని కల్గి



ఉంటాడు. అదే సూర్యుడు 4వ భావంలో దిగ్బలాన్ని పూర్తిగా కోల్పోతాడు. అంటే శక్తివంతమైన బిందువుకు 180 భాగాల దూరంలో ఉన్న బిందువు శక్తిహీనమవుతుంది. గ్రహస్థితికి శూన్య బలస్థితికి మధ్య ఉన్న దూరాన్ని లెక్కించాలి. దీనిని దిగ్బల పరిధి అంటాం. ప్రతిగ్రహం తన దిగ్బలస్థానం సమీపించే కొలది శక్తివంత మౌతుంది. అలానే దిగ్బలం శూన్యస్థానం వైపు వెళ్ళే కొలది దిగ్బలం తగ్గుతూ పోతుంది. పరాశరుడు ఇలా చెప్పాడు. 4వ భావాన్ని రవి, కుజల నుండి తీసివేయాలి అలాగే గురు, బుధలను 7వభాగం నుండి చంద్ర, శుక్రులను దశమ భావం, శనిని లగ్నం నుండి తీసివేయాలి. ఎప్పుడు అయితే శేషం 180 భాగాలు దాటుతుందో 360 నుంచి దానిని తీసివేయాలి. మిగిలినది దిగ్బలపరిధి అంటే దిగ్బలపరిధి = గ్రహస్థితి – గ్రహ దిగ్బల శూన్య బిందువు.

**45. దిగ్బల సాధనం :**

ప్రతి గ్రహం ఏ దిశలో అయితే మంచి శక్తిగల్గి ఉంటుందో అక్కడ అది 60 షష్ట్యంశలబలాన్నికల్గిఉంటుంది. శక్తిహీన ప్రాంతం శక్తిశూన్యమవుతుంది. మధ్యగల భావాలలో త్రైరాశికం ద్వారా గణించాలి దిగ్బలం పరిధిని 3చే భాగించగా దిగ్బలం వస్తుంది. ఉదాహరణ జాతకంలో శని సప్తమ భావంలో ఉన్నాడు. సప్తమభావ మధ్యమం $118^0.27'$ శూన్య బల స్థానము $298^0.27'$ శని దిగ్బల పరిధి $124^0.23' - 298^0.27' = 174^0 - 4'$ (సరిచేయబడినది). దీనిని 3చే భాగించగా దిగ్బలం మనకు 58.02 షష్ట్యంశలు వస్తుంది.

**ఉదాహరణ - 14 :** ఉదాహరణ జాతకంలోని గ్రహాలకు దిగ్బల పరిధిని కనుగొనుము.

| గ్రహం | వాటిస్థితి | | బలశూన్య | బిందువు | | దిగ్బల పరిధి | |
|---|---|---|---|---|---|---|---|
| రవి | $180^0$ | 54’ | $36^0$ | 36’ | = | $144^0$ | 18’ |
| చంద్ర | 311 | 17 | 216 | 36 | = | 94 | 41 |
| కుజ | 229 | 31 | 36 | 36 | = | 167 | 5 |
| బుధ | 181 | 32 | 118 | 27 | = | 63 | 5 |
| గురు | 84 | 1 | 118 | 27 | = | 34 | 26 |
| శుక్ర | 171 | 10 | 216 | 36 | = | 45 | 26 |
| శని | 124 | 23 | 198 | 27 | = | 174 | 4 |

పైన సవరణ అంటే గ్రహానికి, శూన్యబల బిందువుకు మధ్యగల దూరం $180^0$ కంటే ఎక్కువగా ఉంటే ఆ శేషాన్ని $360^0$ నుండి తీసివేయగా వచ్చిన సరియైన దూరం.

**ఉదాహరణ - 15 :** ఉదాహరణ జాతకంలోని గ్రహములకు దిగ్బలంను కనుగొనుము.

| గ్రహము | దిగ్బల పరిధి | | ÷ | 3 | = దిగ్బలము |
|---|---|---|---|---|---|
| రవి | $144^0$ | 18’ | ÷ | 3 | = 48.10 |
| చంద్ర | 94 | 41 | ÷ | 3 | = 31.56 |
| కుజ | 167 | 51 | ÷ | 3 | = 55.70 |
| బుధ | 63 | 5 | ÷ | 3 | = 21.09 |
| గురు | 34 | 26 | ÷ | 3 | = 11.50 |
| శుక్ర | 45 | 26 | ÷ | 3 | = 15.15 |
| శని | 174 | 4 | ÷ | 3 | = 58.02 |



## కాలబలం

**46. కాలబలం :**

కాలాన్ని అనుసరించి నిర్ణయించే బలం, ఈ బలం పుట్టిన సంవత్సరం మాసం, వారము, జన్మకాలంపై ఆధారపడి లెక్కించబడుతుంది. మరోరకంగా చెప్పాలి అంటే గ్రహం కదలికలను, ఋతువుల యొక్క ప్రత్యేకతలపై ఆధారపడి వాటి శక్తులను అంచనా వేస్తాము. కాల బలంలోని అంగాలు. 1) నతోనతబలం,2) పక్షబలం, 3) త్రిభాగబలం, 4) వర్షాధిప బలం, 5) మాసబలం, 6) వారబలం, 7) హోరాబలం, 8) ఆయనబలం, 9) యుద్ధబలం.



**47. నతోన్నత బలం :**

శిశువు జన్మించిన కాలాన్ని బట్టి పగలు – రాత్రి భేదాన్ని అనుసరించి ఈ బలాన్ని నిర్ణయిస్తారు. ఇందు దివాబలము మరియు రాత్రి బలము ఉంటాయి. దీన్నే దివరాత్రి బలము అని కూడా పిలుస్తారు. చంద్ర, శని, కుజలు అర్ధరాత్రియందు బలవం తులు. మధ్యాహ్నమందు పూర్తి బలహీనులు. రవి, గురు, శుక్రులు మధ్యాహ్నమందు పూర్తి బలవంతులు అర్ధరాత్రియందు బల రహితులు. బుధుడు దివరాత్రులు రెండింటి యందును బలము కలవాడు. అర్ధరాత్రియందు శని, కుజ, చంద్రులు 60 షష్ట్యంశల బలాన్ని మధ్యాహ్నం నందు రవి, శుక్ర, గురులు అంతే బలాన్ని బుధుడు ఎల్లప్పుడు అదే బలాన్ని కల్గి ఉంటారు.

**48. అర్ధరాత్రి మరియు మధ్యాహ్నము :**

ఏ ప్రదేశానికైన మధ్యాహ్నం అంటే స్థానిక ఆకాశపు మధ్యభాగం దాటి సూర్యుడు వెళ్ళే కాలం, హిందువులు సాధారణంగా మధ్యాహ్నం 12.00 గంII ఆ రోజు యొక్క మధ్య భాగంగా పరిగణిస్తారు. అంతేకాక జననకాలం స్థానిక కాలమానంలో ఉంటే దానిని Equation of time ఉపయోగించి Apparent Time ను లోకి మార్చాలి. అర్ధరాత్రి సూర్యుడు పాతాళ మధ్యము దాటే కాలం. ఇదే సుమారుగా 12.00 అర్ధరాత్రిగా అవుతుంది.

**49. దివారాత్రి బలాన్ని కనుగొనటం :**

ఇందుకు రెండు పద్ధతులు ఉన్నాయి. రెండింటిలోను సూత్రం ఒకటే. మనం ఆ రెండింటిని "అ", "ఆ" అని సూచిద్దాం.

**ఆ - పద్ధతి :** జన్మకాలం పగలైనా, రాత్రియైనా నత ఘడియలను రెండుతో గుణించగా నత బలము (రాత్రి) షష్ఠ్యంశలలో రాత్రి బలం కల్గిన గ్రహాలకు బలాన్ని ఇస్తుంది. అలాగే ఉన్నత ఘడియలను 2చే హెచ్చిస్తే ఉన్నత బలం మధ్యాహ్నం బలవత్తరమైన గ్రహాలకు దివాబలముగా లెక్కించబడుతుంది. పై దానిని క్లుప్తంగా చెబితే ఉన్నతాన్ని 2 చేత హెచ్చిస్తే దివాబల గ్రహాల బలము, నతము 2చే హెచ్చిస్తే రాత్రి బలము కల్గిన గ్రహాల రాత్రి బలము వస్తాయి.

దివాబలము (రవి, గురు, శుక్రులకు) = ఉన్నత × 2

రాత్రి బలము (చంద్ర, కుజ, శని) = నత × 2

**ఉదాహరణ - 16 :**

ఉదాహరణ జాతకంలోని గ్రహాల యొక్క దివారాత్రి బలం "అ" పద్ధతి ద్వారా కనుగొనండి.

నతము = 5-50 ఘ॥ = 5.84

ఉన్నతము = 24.10 ఘ = 24.16 ఘడియలు.

అయితే దివాబలము 26.14 × 2 = 48.32 షష్ఠ్యంశలు

రాత్రి బలము = 5.84 × 2 = 11.68

| గ్రహము | దివా రాత్రి బలం |
|---|---|
| రవి | 48.32 |
| చంద్ర | 11.68 |
| కుజ | 21.68 |
| బుధ | 60.00 |
| గురు | 48.32 |
| శుక్ర | 48.32 |
| శని | 11.68 |



**51. "ఆ" పద్ధతి :**

మధ్యాహ్నానికి అర్ధరాత్రికి మధ్యగల దూరం $180^0$. అలాగే అర్ధరాత్రికి మధ్యాహ్నానికి ఉన్న దూరం కూడా $180^0$. జన్మకాలం స్థానిక కాలమానంలో ఇస్తే దానిని "ఈక్వేషన్ ఆఫ్ టైమ్"ను ఉపయోగించి స్థానిక Apparent timeలోకి మార్చాలి. తరువాత జన్మకాలాన్ని అర్ధరాత్రి నుండి గంటకు $15^0$ వంతున భాగములలోకి (డిగ్రీలు) మార్చాలి. జన్మకాలం 180 భాగములకంటే ఎక్కువ వస్తే దానిని $360^0$ నుంచి తీసివేయాలి.

1) $\frac{\text{భాగాలలో జన్మకాలం}}{3}$ = దివాబలము (సూర్య, గురు, శుక్రులకు)

2) $\frac{180^0 - \text{భాగాలలో జన్మకాలం}}{3}$ = రాత్రి బలము (చంద్ర, శని, కుజులకు)

**ఉదాహరణ - 17 :**

"ఆ" పద్ధతి ప్రకారం ఉదాహరణ జాతకంలోని గ్రహములకు దివారాత్రి బలమును కనుగొనుము.

జన్మకాలము : 2-6 (P.M.) (స్థానిక కాలం)

Equation of time = 14 నిముషాలు

సవరించిన జన్మకాలం = 2.20 P.M. = $215^0$ 0'=($360^0$-$215^0$) = $145^0$

దివాబలము = $\frac{145^0}{3}$ = 48.32 (రవి, గురు, శుక్రులు)

రాత్రిబలము = $\frac{180^0 - 145^0}{3} = \frac{35^0}{3}$ = 11.68 (చంద్ర, కుజ, శనులకు)

బుధునకు = 60

**52. పక్ష బలము :**

ఒక పక్షములో 15 చంద్రమాన దినాలు ఉంటాయి. శుక్ల పక్షంలో చంద్రుని వృద్ధి బహుళ పక్షములో చంద్ర కళల క్షయం కలుగుతాయి. పాపులు కృష్ణపక్షంలోను, శుభులు శుక్ల పక్షంలో బలాన్ని కలిగి ఉంటారు.

